శ్రీరస్తు.

# రామతారకశతకము.



చెన్నపురి:
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్
వారిచే ప్రకటితము.

1925

శ్రీరస్తు.

# శ్రీరామతారకశతకము.

Sri Ramataraka Satakamu



చెన్నపురి:

వావిళ్ల, రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచేఁ బ్రకటితము.

1925.



శ్రీ రామచంద్రాయ నమః.

# రామతారకశతకము.





రామనామమే శృంగారవర్ణన సక
లశాస్త్రవివేక సాధనంబు, శ్రీరా
మనామమే శృంగారచారిత్ర సక
లదానవిశేషసంగ్రహంబు, శ్రీ
రామనామమే శృంగారధాన్యంబు సకలతీ
ర్థామృతసత్ఫలంబు, శ్రీరామనామమే శృం
గారచింతన సకలమంత్రరహస్యసమ్మతంబు,
తే. అనుచు బ్రహ్మాదిసురలెల్ల ననుదినంబు,
భక్తితో రామమంత్రంబు పఠనఁజేసి, మ్రొ
క్కి సేవించి చెందిరి మోక్షపదవి, రామ
తారక దశరథరాజతనయ. ౧

శ్రీరామ నాయొక్క జిహ్వపై మీనామ
యక్షరబీజము లమరవ్రాసి, వాని నాపలు
కుల వసియింపఁ గాఁ జేసి శత్రుసంహారంబు
సలుపఁబూని, యుక్తియు బుద్ధియు యూ
హ దాసున కిచ్చి భక్తితో మీపాద భజన
యందు, నాసక్తి పుట్టించి యమృతసారం
బెల్లఁ దారకశతకంబుత్వరితముగను, తే. ప
లుకఁ బలికించు వేవేగ పరమపురుష, యింపు
గఁ బఠించువారికి నిహము పరము, దాతవై
యిచ్చి రక్షించు భక్తచరిత్ర... ౨

నరులార సేయుఁడీ నారాయణజపంబు
ప్రొక్కి సేవించిన మోక్షకారి, జనులార
పల్కుఁడీ జయరామనామంబు కార్యార్థము
లకెల్లఁ గల్పవల్లి, ప్రజలార సేయుఁడీ పంక
జాక్షునిపూజ సాయుజ్యపదవికి సాయకారి,

మానవబుధులార మఱవక తలంచుఁడీ పరమా
త్మశబ్దంబు పాపహారి, తే. పెక్కుమార్గంబు
లను బోక ప్రేమచేత, భక్తితో రామమం
త్రంబు పఠనఁ జేసి, మ్రొక్కి సేవించి చెం
దుఁడీ మోక్షపదవి... 3

తలఁచుఁడీ జనులార తారకనామంబు గో
విందనామమే కొల్లగొనుఁడీ, కృష్ణనామం
బెప్పుడుకీర్తన జేయుఁడీ మాధవనామంబు మ
ఱవకండీ, హరినామకీర్తన యందు సేయుఁ
డీ వాసుదేవస్మృతి విడకండీ, విష్ణుసంకీర్త
న విడువక సేయుఁడీ నరసింహనామంబు న
మ్ముకొనుఁడీ, తే. కలియుగంబున జనులార
కష్టపడక, నామకీర్తనపుతోట నయముసుం
డీ, మరలజన్మంబు గాంచరు మహినిమీరు...

ఓపిమోపకయైన నొక్కసారైనను వేఱ

చి వేఱపు లేక వేడ్కనైన, 'హా రామ! హా కృష్ణ! హా యచ్యుతా!' యని భయముతో నైనను భక్తినైనఁ, బ్రేమతో బుత్రులపేరు పెట్టియినను జిలుకను బెంచైనఁ జెలిమినైన, భువిలోనఁ గీర్తికిఁ బురము గట్టియినను వన తటాకములుంచి వాంఛనైన, తే. నీదునామంబు పలుకుట నిఖిలసుఖము, గలుగు వర్ధిలు పుత్రుండు ఘనత మెఱయు, జన్మకర్మంబు లతనికిఁ జూటు నేల... ౫

నీనామమే కదా నిఖిలశాస్త్రములెల్ల స్వర్గలోకాప్తికిసాధనంబు, నీనామమేకదా నిఖిలజీవులకెల్ల నఖిలవైభవముల కాలయంబు, నీనామమేకదా నిర్మలాత్ములఁ జేయ జ్ఞానజీవులకెల్ల నౌషధంబు, నీనామమేకదా నిశ్చలభక్తుల కార్యసిద్ధికి నాదికారణంబు,

తే. దునిమి భేదించు దారిద్ర్యదుఃఖమెల్ల,
వాసి కెక్కించు సంసారవార్ధి గడిపి, శాశ్వ
తం బైనపదవిచ్చు జగతియందు... ౬

హరి రామ నీవు నాయంతరంగమునందు
సాక్షివై యుండుట సత్యమైన, పావనంబా
యెను బాంచభౌతికమెల్లఁ గాయంబు జల
ములఁ గడుగ నేల, మమకారముడిగిన మా
నును గర్వంబు వేధించు వేల్పుల వెఱవనేల,
విత్తక్షీణం బైన పీడను గర్వంబు మోహం
బు లుడిగిన మోక్ష మదియె, తే. నిష్ఠయీ
రీతి నిజముగా నిలిచెనేని, మనసు గట్టిసేఁజా
లదా మాయ గెల్వ, భ్రాంతు లుడిగిన బ్ర
హ్మంబు బట్టబయలు... ౭

కామితార్థము నిచ్చు కామధేనువుగల్గ వె
లఁబెట్టి గోవుల వెదకనేల, మరణంబు తే

కుండ మందు దాఁ గల్గఁగా సభయులై య
మునికి జడియ నేల, కల్యాణమొసఁగెడి
కల్పవృక్షముగల్గ వనపుష్పఫలముల వాం
ఛయేల, యమరుల కబ్బని యమృతంబు సే
వించి మధురసంబులమీఁద మమత లేల, తే.
తారతమ్యంబులేరితిఁ దథ్యమనుచు, భజనఁ
జేతురు మిమ్ముల బ్రహ్మాదులు, స్తుతులు సే
యుదు రెప్పుడు సురలు గూడి... రా.

భూపతియైపుట్టి భూమినేలఁగవచ్చు శ
త్రుసంహారంబు సల్పవచ్చు, చౌషష్టివి
ద్యలు చదివి చెప్పఁగవచ్చు బహుమంత్రసి
ద్ధులఁ బడయవచ్చుఁ,గోటికిఁబడగెత్తి గొ
ల్లపెట్టఁగవచ్చు సకలమంత్రంబులు చదువ
వచ్చు,గంగాదినదులకు గ్రక్కునఁబోవచ్చు
నుత్తమాశ్రమముల నొందవచ్చు, తే. మగు

డ జన్మంబురాకుండ మాయగెలుచు, విద్య
సాధించి శత్రుల విడిచికట్టి,యరసి బ్రహ్మం
బు గనుఁగొను టొండెగాక... ౯

సతమని దేహంబు సంతసిల్లఁగ నేల నిలుచు
నా యిది వట్టి నీరుబుగ్గ, కాయంబు నిలువ
దు కడు బ్రహ్మకైనను బ్రాణంబు నిలుచునా
భ్రాంతి గాక, విభవంబుఁ జూడకు విశ్వంబు
లోపల సంపద లెప్పుడు సతముగావు, పురు
లు నావారని పాటింపఁజెల్లదు వెళ్లంగఁ దన
వాసు వెంటరాసు, తే. అనుచుఁ దలపోసి బు
ధు లెల్ల యాశ లుడిగి, మోహజాలంబులోఁ
బడి మోసపోక, నిన్ను సేవింపుచుందురు నీ
రజాక్ష... ౧౦

ఆవేళ యమునిచే నాపదఁబడలేక జడిసి
యిప్పుడ మిమ్ముఁదలఁచుకొంటి, నపరాధి న

పరాధి నపరాధి నని మ్రొక్కి యాశ్రయిం
చితి మిమ్ము నప్రమేయ,శరణన్న మాత్రాన
శంకలన్నియుఁ మాని భయనివారణమాయె
భజనచేత, నింత సులభుఁడగు టెఱుఁగనై
తిసిగాక యేమరియుందునా యెఱిఁగియు
న్నఁ, తే. దెలిసె మీకృప నాకెల్లఁ దేటపఱ
చె,మర్మ మెఱిఁగితి మీకీర్తిమహిమ వింటి,గట్టు
దాటితి నీవె నాగతి యటంటి... ౧౧

పరము దప్పక ధర్మవర్తన వర్తించి వేదోక్త
మర్మముల్ వెదకి చూచి, శుద్ధశీలురయొ
క్క శుశ్రూషణముచేసి సర్వప్రదానంబు
సంగ్రహించి, సద్దయార్ద్రులగుసుస్వాముల
మది నుంచి హరిఁ జేయు మార్గంబు సరవి నడి
గి, వారిచేఁ బడసిన వరమంత్రరాజంబు పర
చిత్తుఁ డనుగాక పఠనఁ జేసి, తే.మఱచి యే

మియుఁ గోరక మర్త్య మెల్ల, హరికి నర్పించి
నట్టి యా యధిక పుణ్య, మరసి రక్షించు
టది యెల్ల నంతేగాక... ౧౨

హరినామకీర్తన లానాఁడుచేసిన తాప
త్రయము నన్ను పగులకుండు, నీక్షించిమ
దిలోన నినకులోత్తమ యున్న నీమంత్రయ
మున న్నీద్వకుండు, దశరథాత్మజు గూర్చి
ధ్యానంబుఁ జేసితే దారిద్ర్యదోషముల్ ద
లఁగియుండు, జానకీపతిమంత్రజపము నొన
ర్చిన జన్మకర్మంబులు చెంపకుండు, తే. భక్తి
పుష్పంబు పక్వమై పండుఁగాక, యమితకా
లంబు లిన్నాళ్లు హరణమయ్యెఁ, బాలకుఁడ
నన్ను రక్షించు పరమపురుష... ౧౩

మఱిమఱి జిహ్వకు మాధుర్యమైయుండు
మనసు మీస్మరణకు మరగియుండు, వీనులు

మీకథ ల్వినవేడ్కలయియుండు చూడ్కు
లు మీరూపు చూచుచుండు, బుద్ధిమీతత్త్వం
బుపొందగోరుచునుండుఁ బూజింపహస్తము
లొప్పొంగుచుండుఁ, గామ్యంబు మోక్షంబు
కాంక్షఁ జేయుచు నుండు భక్తి యీరీతిని
బ్రబలుచుండు, తే. నితరనామంబు పలుకు
టకింపుగాదు, సతతమును నీదు నామంబు
సంస్తుతింప, హర్ష మానంద మగుచుండు న
నుదినంబు... ౧౪

నీప్రభావంబులు నిగమంబులేకాని పలికి
వర్తింప నాబ్రహ్మవశమె, నీనామమధురుచి
నీలకంఠుఁడెగాని వేయికన్నులుగల వేల్పు
వశమె, నీపావనఖముచే నిర్భిన్నమయిన
ట్టి బ్రహ్మాండకటక మెవ్వరికి వశమె, నీకీర్తి
గొనియాడ నిశ్చలులయినట్టి నారదాదు

లుగాని నరులవశమె, తే. యెన్నఁగూడని
తారల నెన్నవచ్చు, సికతకణముల గణు
తించి చెప్పవచ్చు, పరమతారకమంత్రంబు
పలుకవశమె... ౧౫

నిన్నాశ్రయించితి నీవాఁడ ననియంటి
'పాహిమాం కోదండపాణి' యంటి, రఘుకుల
దీపక రక్షించుమనియంటిఁ గరుణసాగర న
న్నుఁ గావుమంటి, దైవమ్మునీవని దిక్కు నీవ
నియంటి దుష్కృతకర్మముల్ ద్రుంచుమం
టి, నఖిలలోకారాధ్య యభయ మిమ్మని
యంటి నీప్సితార్థము లిప్పు డిమ్మంటి,
తే. నడుగ నెంతయు నితరుల నమరవంద్య,
పరుల యాచింప నాకేల పరమపురుష, దా
తలకునెల్ల దాతవౌ దైవరాయ... ౧౬

యెచ్చోట హరికథ లచ్చోట సిద్ధించు

గంగాదితీర్థముల్ గన్న ఫలము, యెచ్చోట
సత్యంబు లచ్చోట నిత్యంబు లక్ష్మిసరస్వ
తు లమరియుండు, రెచ్చోట ధర్మంబు ల
చ్చోట దైవంబు జయము నెల్లప్పుడు జెం
దుచుండు, యెచ్చోట భక్తుండు నచ్చోట
హరియుండు నిధులఫలం బిచ్చు నింటనుం
డు, తే. నీదుభక్తునిగుణములు నిర్ణయింప,
ఫలముభాగ్యము నింతని ప్రస్తుతింప, వశ
మె యెవ్వరికైనను వసుధలోన... ౧౭

పదివేలగోవులు ప్రతిదినం బొసఁగినఁబం
చభక్ష్యాన్నము ల్పరగనిడిన, గ్రహణపర్వ
ములందు గజదానమొసఁగిన నశ్వదానం
బులు నమితమైనఁ, బెక్కుయాగంబులు ప్రే
మతోఁ జేసిన నితరధర్మంబులు నెన్నియైన,
తే. తుల్యమగునట్టి మీనామతుల్యమునకు,

హస్తిమశకాంతరము సాటి యవునుగాక,
యింతఫలమని వర్ణింప నెవ్వఁడోపు... ౧౮

నాపాలిదైవము నామనంబున నిన్నుఁ దలచి సేవించెదఁ దండ్రి వనుచు, నామూలధనమని నమ్మి యుప్పొంగుచు దండమర్పించెద దాతవనుచు, నాతోడ నీవని నవ్వుచుఁ జేసుచు రంజిల్లుచుండెద రాజవనుచు, నాకును గురుఁడవై నాతప్పులెన్నక కాచిరక్షించగఁ గర్త వనుచుఁ, తే. బెంచి పోషించి కాపాడు పెద్దవనుచుఁ, బుత్రుపైఁ బ్రేమ తండ్రికిఁ బుట్టినట్లు' కృపకుఁ బాత్రునిగాఁ జేసికొనుము దేవ... ౧౯

బహుజన్మములనెత్తి బాధ నొందఁగ నేల పరమపురుషుఁ గొల్చి బ్రతుకవలయు, వేషవాసన చేత వెక్కివగవఁగ నేల శ్రీనివాసు

నిపూజ సేయువలయు, విషయభోగంబుల
విఱ్ఱవీఁగఁగ నేల విష్ణుచరిత్రంబు వినఁగవల
యు, నస్మదాదులకొఱ కనృతమాడఁగ నేల
హరినామకీర్తనల్ పాడవలయుఁ, తే. దనువు
తథ్యంబు గాదని తత్త్వవిదులు, సంతతధ్యా
నులై మిమ్ము సంస్మరించి, నిరతమును గొ
ల్చుచుందురు నీరజాక్ష... ౨౦

ఈప్సితార్థము లిచ్చి యిహమందు ర
క్షించి పరమందు మీసేవ ప్రాప్తిఁ జేసి, యగ
ణితం బైననీయాశ్రయవంతుల గణుతించి
గ్రక్కున గారవించి, భక్తునిఁ గృపఁ జేసి పరి
పూర్ణముగ నుంచి నిజముగా దాసుల నిర్వ
హించి, ప్రియముతోఁ బిలిచినఁ బ్రేమతోఁ బొ
డసూపి యభయహస్తము లిచ్చి యాదరిం
చి, తే. యొరుల యాచింప సేవింప నోర్వ

లేక, వెసకి కనుఁగొంటి నాపాలివేల్పువను
చు, మఱపడే జన్మంబు లేకుండ మందుగోరి.
మూఢులరక్షించి మోక్షమిచ్చుటకీర్తి
ప్రోహులఁగాచుట పొడ్డకీర్తి, కర్మపాపులకెల్ల
పదమిచ్చుటదికీర్తి యాత్మసంరక్షణయమిత
కీర్తి, నీవాఁడనని సంతు నిర్వహించుటకీర్తి
ప్రేమదీనులఁబ్రోవఁ బెద్దకీర్తి, సామాన్యజీవు
ల సంతసించుటకీర్తి మునుల రక్షించుట ఘ
నత కీర్తి, తే. పెద్దలెట్టి సంసారపామరుల
కు, సమసాయుజ్యపదమిచ్చు టంతెకాక,
యనుచు సేవింతు రీకీర్తి ననుదినంబు...
జంతుజాలమునందె జన్మించి కొన్నాళ్లి
నితరజన్మంబుల నెత్తియెత్తి, మానవదేహం
బు మఱిమఱియెత్తుచు నన్నివరంబుల నర
సిచూచ్చి, యేపుణ్యవశమున నీజన్మ మెత్తితి

విప్ర దేహంబిప్డువిమలచరిత, యీజన్మమందైన నిప్పుడు నీసేవ మానక చేసెద మౌనివంద్య, తే. వేదశాస్త్రంబులన్నియు వెదకిచూచి, తప్పుగాకుండ నడువ నాతరము గాదు, శరణుఁజొచ్చితి నిఁక నాకు శంక యేమి... ౨౩

దశరథాత్మజ నీకు దండంబు దండంబు వైదేహిపతి నీకు వందనంబు, కౌసల్యసుత నీకుఁ గలుగుఁగల్యాణంబు జానకీపతినీకుజయము జయము, అమరవందిత నీకు నాయురారోగ్యముల్ శరధిసుధ్ధర నీకు శరణుశరణు, నీలమేఘశ్యామ నీకుసాష్టాంగంబు సురరాజపూజిత శుభముశుభము, తే. అనుచు వర్ణించి భజియించి యాత్మఁదలఁచి, నిలిచి సన్మార్గవంతుండు నిన్నెఱుంగు, నతని గనుఁ

గొన్నఫల మెన్న నావశంబె... ౨౪

భానువంశమునందు బ్రభుఁడవై జన్మించి యఖిలవిద్యల నెల్ల నభ్యసించి, తాటకిమర్దించి తపసియాగముగాచి శిలను శాపము మాన్పి స్త్రీనిఁ జేసి, శివునిచాపము ద్రుంచి సీతను బెండ్లాడి పరశురాముని ప్రాణ భంగపఱచి, తండ్రివాక్యమునకై తమ్మునితోఁగూడి వైదేహితోడను వనముకరిగి, ఖరదూషణాదుల ఖండించి రాక్షస మారీచ మృగమును మడియఁ జేసి, రాక్షసరాజగు రావణుఁ డేతెంచి సతిఁగొనిపోవంగ శాంతపడఁగ, సుగ్రీవుఁగనుఁగొనిసుముఖుఁడై యప్పుడు వాలినివధియించి వానసతోడ, రాజ్యమాతనికిచ్చి రాజుఁగాఁ జేపట్టి కిష్కింధ నేలించి కీర్తివడసి, తే. వాయుసుతుచేత జానకి వా

ర్త దెలిసి, తర్లి సేతువు బంధించి త్వరను దాఁ
టి, రావణానుజు కభయంబు రయమునొ
సఁగి, ఘోరరణమందు రావణుఁగూలనేసి,
యతనితమ్ముని రాజుగా సమరఁజేసి, సతిని
జేకొని సురలెల్ల సన్నుతింప, రాజ్యమేలి
తయోధ్యకు రాజవగుచు… ౨౫

దేహంబువిడుచుట దినము తా నెఱుఁగఁ
డు కర్మంబు వచ్చుట గానలేఁడు, మూఁడవ
స్థలలోన మునిఁగి తేలఁగలేఁడు నయ్యారుశ
త్రుల నణఁచలేఁడు, మగువలరతులందు
మమత మానఁగలేఁడు వాఁడు వీఁడనిపల్కు
వపలేఁడు, అభిమానరహితుఁడై యాసలాఁ
పగలేఁడు నించుక హరిమాయ యెఱుఁగ
లేఁడు, తే. అందు బ్రహ్మంబు తానగుటర
యలేక, బుద్ధిహీనులకడ కేఁగి పొందుఁజేసి,

యుదరభరణంబు గానక యుర్విలోన...
నీతియెఱుంగవు నిందకునోడవు చంచలం
బెప్పుడు చెడ్డగుణము, వాయువేగముకం
టె వడిగలవాఁడవె పాటెవ వెప్పుడు పడు
చుఁదనము, పేరుపే రొక్కటి పిలుచుట
యొక్కటి చేయుకర్త్రంబు చెప్పలేవు, పు
త్రమిత్రాదులే పుణ్యలోకం బని స్తుతియె
ఱుగవుఁ జడుఁడ వగుచు, తే. మనసు నీకీతి
వర్తించు మందమతివి, నడచి నగరంబుకేఁ
గుట నయమె నీకు, ముందు తెలియక విహా
రించి మోసపోక... ౨౭

యమునిచే బాధలనెట్లోర్చఁగావచ్చు న
గ్నికంబంబున కంటుగట్టి, పాపంబు నానోటఁ
బలికించి యొప్పించు చిత్రగుప్తునిఁబిల్చి
చెప్పమనుచుఁ, దప్పక వాసు నాతప్పులన్ని

యుఁ జెప్ప నుగ్రుఁడై దూతల కొప్పగించి,
బాధించువేళ నాబ్రదు కేలాకో యని యే
డ్వంగ నెవ్వరు నచటరారు, తే. తెలిసివర్తిం
చు మిప్పుడే తెలివి గలిగి, యనుదినంబును
శ్రీరాము నాశ్రయించి, మ్రొక్కి సేవిం
చి కనుఁగొంటి మోక్షపదవి... ౨౮

మఱిమఱి నాయొక్క మర్మకర్మంబులు
ప్రఖ్యాతిఁ జేసెదఁ బాపహరణ, ధర శీలుఁ
డయినట్టి ధన్వంతరిదారక దేహరోగంబెల్ల
దెలిపినట్లు, గురుశిష్యుఁడయినట్టి గురువు
ను గనుఁగొని ముక్తిమార్గమునకై మ్రొక్కి
నట్లు, రక్షింపఁదలఁచిన రాజులఁ గనుఁగొని
యార్తుఁడై యన్నంబు నడిగినట్లు, తే. విన్న
వించెద నావార్త విమలచరిత, యగణితంబై
న కలుషంబు లణఁగఁ జేసి, నిర్మలాత్మునిగాఁ

జేయు నిగమవేద్య... ౨౯

ఎన్ని జన్మంబుల నెత్తితి నేనని తప్పక పలు
కు నాతపసి యొకండు, శత్రులమిత్రుల
సమముగాఁ జూచుచు శ్రీహరి నమ్మిన సిద్ధుఁ
డొకండు, సకలేంద్రియంబులు సాధనం
బునఁబట్టి ముక్తుఁడై యుండు నా మునియు
నొకండు, కామాదిశత్రువర్గములోనఁజిక్క
క యుండుయోగముననుండు యోగియొకఁ
డు, తే. బ్రహ్మయీతివాఁడని పలుకవచ్చుఁ,
గాని యితరులు నేర్తురే కనుఁగొనంగ, సక
లవేదాంతములఁగల్గు సారమిదియు... ౩౦

జపము దేవార్చనఁ జెందనట్టి మతంబు
తామసంబునఁ జేయు తపసితపము, పతిభ
క్తిలేనట్టి పణంతుల వ్రతములు యజమానుఁ
గూర్చని యాగములును, గురుభక్తిలేనట్టి

గూఢమంత్రంబును విత్తమార్జించెడి వేద
ములును, గానులార్జించెడి కన్యకాదానంబు
ధనము వాటునఁగొన్న ధర్మములును, తే.
నెంచిచూచిన నవియెల్ల నేమిఫలము, ఫల
ము దెలియంగ నేరక పాడిదప్పి, నడచి
నరకంబుఁ గేఁగుటనంగ నొకటె... 30

అఖిలాండకోటి బ్రహ్మాండనాయక నీవు
ముచుకుందునకు మోక్ష మిచ్చినావు, ఆకు
చేలునిచేతి యడుకులు భక్షించి యింపైన
సంపద లిచ్చినావు, శరణాగత త్రాణ శబరి
దెచ్చినపండ్లు నంచితంబుగ నారగించినా
వు, వేదవేదాంగ యావిదురుని యన్నంబు
కోరి వేడుకతోడఁ గుడిచినావు, తే. జానకీ
నాథ మీదాసజనులయిండ్లఁ, దులసిదళమై
న మీజిహ్వ తృప్తిఁబొందు, నచ్యుతానంద

గోవింద హరి ముకుంద... 32

ఆశ్రమధర్మముం దాసనొందినవాఁడు స
త్యవాక్యం బెప్డు పలుకువాఁడు, శ్రీరాము
నర్చించిసిరియుఁగోరనివాఁడు మమకారబు
ద్ధియు మానువాఁడు, లబ్ధపదార్థంబు లా
భంబులనువాఁడు పరులకు హితముగాఁ బ
లుకువాఁడు, పుణ్యకర్మంబులయందు బుద్ధిగల్గిన
వాఁడు దుష్ప్రచారములనుదొలఁగువాఁడు,
తే. యోగసంసారికీర్తుల మెంచవలయుఁ,
గాక కడుభక్తివేషంబు గణనఁజేయు,వలదు
సంసారబుద్ధుల వాంఛగాక... 33

విష్ణుప్రసంగముల్ విడువక వినిగడుఁ బు
లకాంకురంబులు పొడమువాఁడు, హరి గా
నములయందు నాసకల్గినవాఁడు సకలోప
చారముల్ సలుపువాఁడు, అతనికర్పించితా

ననుభవించెడివాఁడు సుమతునికై వడిఁ జూ
చువాఁడు, సాధులమాన్యుల సౌఖ్యపెట్టెడి
వాఁడు మనసులో శ్రీరామ యనెడివాఁడు,
తే. పుణ్యపురుషుండు భక్తుండుపూజితుండు,
ధర్మమార్గుండు ధన్యుండు ధార్మికుండు,
కలఁడు వేయింట నొకఁడు కడమలేఁడు.

తల్లిదండ్రులఁ గన్న తాతముత్తాతలు స
ర్లిపోయినవార్త తాను దెలిసి, జీవించు పె
క్కండు జీవకోట్లను జూచి జననమరణ
ముల బాధ లెఱిఁగి, సర్వకాలము నిల్చి సంప
దనుఁడు నా విభవంబు రాజులదింతఁజూచి,
సారంబులేనట్టి పాపపుసంసార మహావేదనల
చేత ననుభవించి, తే. కనియుఁ గానంగఁజా
లరు కర్మవశులు, అస్థిరం బెల్ల స్థిరమన కవ
నిబుధులు, సన్నుతింతును మిమ్మును సంత

తంబు... ౩౫

ఈషణత్రయమును నీక్షించి మదిలోన
మేలు లేదని వీడు మేటియొకఁడు, సద్గుణం
బు తనకు సామాన్యమని యెంచి స్వస్థుఁడై
యుండు నా సాధుఁ డొకఁడు, అష్టభోగం
బుల నాభాసమనియెంచి తుచ్ఛంబుగాఁ జూ
చు దొడ్డయొకఁడు, విషయంబులనుబట్టి వి
రహింపఁజాలక సూటి దప్పకచూచు సుము
ఖుఁ డొకఁడు, తే. వనము పురమని కోరక
వాన యనక, యెండ మంచు లెంచుచుని
నెఱుకలేక, యుండు నీకృతి నవధూత
యుర్వ్వలోన .. ౩౬

జన్మదాల్చుఫలమ్ము జగదీశ్వరుని మేటిభ
వ్యంపుగుణకథల్ పలుకనైతి, బుద్ధిగల్గుఫల
మ్ము బుధులచెంతనుఁ జేరి హరిఁ జేరుమార్గం

బు లడుగనైతిఁ, గాయమొందుఫలమ్ము కర్మ
సంసారినై నీయందుఁ జిత్తంబు నిలుపనైతి,
బహువత్సరంబులు బ్రతికిన బ్రతుకుకు సక
లతీర్థపుసేవ సలుపనైతి, తే. బాల్య కౌమా
ర యౌవన భ్రాంతిచేత, వ్యర్థమాయెను గా
లంబు వాసవనుత, త్రాహి శరణంటి ననుఁ
గావ వోడ్డఘునత... 32

సంభ్రమించుఫలము సంసారరహితుఁడై
భజియించి నిశ్చలభక్తుఁ డగుచు, భక్తివా
త్సల్యంబు భావంబున నెఱింగి యటుమీఁద
సంతాన మమరఁ జేయు, సంతానమార్గంబు
సతమని నెఱనమ్మి యమృతస్వరూపుఁ డై యు
లరుచుండు,ని న్నది నెంచక నిత్యంబునై చా
ల దుష్కరనరకకూపమునఁ బడక, తే. చ
దువుపల మిది జగమున నరులకెల్లఁ, గోటివి

ద్యలు నవియెల్లఁ గూటికొఱకె, కోన భేదించి యెలుకను గొనఁగవలెనె... ౩౭

మధుశర్కరాక్షీరదధిఘృతంబులకంటె రామనామామృతరసము రసము, పనసజంబూద్రాక్ష ఫలరసంబులకంటె రామనామామృతరసము రసము, కదళికామకరంద ఖర్జూరములకంటె రామనామామృతరసము రసము, నవసుధాసరమాన్న నవనీతముల కంటె రామనామామృతరసము రసము, తే. రామనామంబునకు సాటి లేదు, రామ నామంబుసేవించి నారదుండు, బ్రహ్మఋషియయ్యె నిహమందుఁ బదవినొంది... ౩౮

శ్రీమంతుఁడగు రామచంద్రునిఁ దలఁచిన నరచేత మోక్షంబు నందినట్లు, జయరామనామంబు జపము గావించిన జీవాత్మకును

ముక్తి చెందినట్లు, కాకుత్థ్సతిలకుని గన్నుం
లం జూచిన బహుపేదలకు ధనం బబ్బినట్లు,
శ్రీరామచంద్రుని సేవింపఁగలిగిన నష్టభో
గంబులు సమరినట్లు, తే. కరుణగలయట్టి
సద్గుణ గలిగినట్లు, జీవనదులందు స్నానం
బు చేసినట్లు, కుటిలమది లేక జ్ఞానంబు కుది
రినట్లు... ౪౦

ఓ రాఘవా! యని యొకసారి దలఁచిన
దుఃఖావళు లవన్ని పోలఁగిపోవు, నొనర రెం
డవసారి యోరాఘవా! యన బహుభోగ
భాగ్యసంపదలు గల్గుఁ, జెలఁగి మూఁడవ
సారి శ్రీరామ! యన్నను ముక్తుఁ డై వై
కుంఠమున వసించు, రమణ నాలవసారి రా
మచంద్రా! యన నతి నీబుఃస్థుఁడ వయ్యె
నీవు, తే. అల్పసంతోషసులభుఁడ వగుదు

వయ్య, యెలమియీజీవపర్యంత మరయ
మిమ్ముఁ, దలఁచువారికి నాపదల్ తలఁగు
టరుదె... ౪౧

కీడు మేలని రెండు క్రియఁటిజన్మంబు సం
గ్రహించినయట్టి సంచితంబు, అనుభవింపు
చు నపు లాత్మతథ్యము లేక మేనెల్లఁ దమ
దని మెచ్చుకొనుచుఁ, గీడువచ్చినవేళఁ గ్రి
య కోర్వఁజాలక పాపంబు దలఁతురు భ్రాం
తిచేత, నట్టిపాపంబు తా ననుభవింపుచు
నుండు పాయనిసంసారపాశములను, తే.
బద్ధులై యుండు దుర్జనుల్ పంపలగుచుఁ,
బాపఫలములు భాసుర భ్రాంతిగాక, వలవ
దితరులవలె వట్టివాంఛ గోర... ౪౨

కర్మశేషమ్మునఁ గల్గుజన్మంబును జన్మహే
తువుచేతఁ జెడు నతండు, మూఢుఁడైమముం

దరి ముచ్చట దెలియక బద్ధుఁడై యుండు
ను భ్రాంతితోడఁ, దనువు సంసారంబు త
థ్యం బని తలంచి హరినామభజన నాసక్తి
లేక, యనుదినంబును నయఁ డాసక్తుఁడైనట్టి
పుత్రమిత్రాదులే పుణ్యమనుచుఁ, తే. బరుల
యాడించి పీడించి పాప మొంది, పుట్టు నీకి
తిఁ గాలంబు భూమిలోన, నిన్నుఁ జింతింప
జేకూడదె నీపదంబు… ౪౩

రామరామా యని పంజిల్ల నావంతు నిజ
ముగా రక్షింప నీదువంతు, అపరాధి నని
పల్కి యాచింప నావంతు నిజముగా ర
క్షింప నీదువంతు, నీపాదపద్మంబు నెఱనమ్మ
నావంతు నిజముగా రక్షింప నీదువంతు, ఒ
రుల సేవింపక యోర్చుట నావంతు నిజము
గా రక్షింప నీదువంతు, తే. నేను బంతంబు

దప్పక నిన్నుఁ గొలుతు, నీవు పంతంబుఁ ద
ప్పక నిర్వహించు, పంత మిది నీకు నాకును
బరమపురుష... ౪౪

గోవృమండల కోటి గోదాన మొసఁగిన
సరిరావు మీనామసంస్మరణకుఁ, గాశీ ప్రయా
గయు గంగాదితీర్థముల్ సరిరావు మీనామ
సంస్మరణకు, బహుయజ్ఞములుచేసి ప్రస్తుతి
కెక్కిన సరిరావు మీనామసంస్మరణకు, వేద
శాస్త్రంబులు వెదకిచూచినఁగాని సరిరావు
మీనామసంస్మరణకు, తే. నెంచఁగా నిన్ను
వశమె బ్రహ్మేంద్రులకును, బుధజనస్తోత్ర
సద్గుణ పుణ్యచరిత, యఖిలసురవంద్యదివ్య
పాదారవింద... ౪౫

అల్పులమాటల కాసపడఁగ నేమి ఫలము
బూరుగఁ జూచి భ్రమసినట్లు, నీచులమాట

లు నిశ్చయింపఁగనేల నీరుగట్టినమూట ని
లిచినట్లు, గుణవిహీనునిమాట గురిసేయఁగా
నేల గొడ్డుగోవులపాలు గోరినట్లు, కపట
ఘాతకునిమాట కాంక్షసేయఁగనేల కలలో
ను మేలు దాఁగన్నయట్లు, తే. పామరుని
మాట నెంతైనఁ బాటిఁజేసి, యడుగఁ గో
రెడి వారిదే యల్పబుద్ధి, నీతిమంతుల కివి
యెల్ల నిశ్చయములు. ౪౬

శ్రీరామనామంబు చిత్తాబ్జమున నిల్పి ఫా
లలోచనుఁ డిలఁ బ్రణుతికెక్కెఁ, గాకుత్థ్స
తిలకుని కరుణారసంబునఁ గల్పాంతరస్థితి
కపి వహించె, ఖరవైరిపదరేణు కణములు
సోఁకినఁ గలుషములార్పె సెను గాంతకపుడు,
పులుఁగులరాయఁడు రఘుపుంగవు నుతించి
నిర్వాణపదమందు నిలచె వేడ్కఁ, తే. హాట

కాంబరు లక్ష్మీశు నాత్మఁదలఁచి, కూర్మినరు
లార మోక్షంబుఁ గొల్లగొనుఁడీ, రామనా
మామృతంబున కేది సమము... ౪౭

సకలభూతవ్రాత సంఘవిధ్వంసంబు రా
మతారకమంత్రరాజ మరయ, సకలరక్షో
వీరజాలనిర్మూలంబు రామతారకమంత్ర రా
జ మరయ, సకలతీర్థామ్నాయసారసంగ్ర
హ వేది రామతారకమంత్రరాజ మరయ,
సకలదేవక్షేత్ర సత్పుణ్యఫలదంబు రామతా
రకమంత్రరాజ మరయ, తే. సకలమునిజన
చిత్తాబ్జసారభృంగ, మైన శ్రీరామనామం
బు ననుదినంబు, స్మరణ సేయుఁడీ జనులార
సత్ఫలంబు... ౪౮

గాధినందను యజ్ఞకార్యంబు సమకూర్పఁ
బ్రకటితంబయిన యా ప్రాభవంబు, వాస

వతనయుని వసుధపైఁ బడవైచి వర్ణనకెక్కిన వైభవంబు, శతయోజనాయత సాగరంబున సేతు బంధంబొనర్చిన ప్రబలశక్తి, రావణుఁ డాదిగా రాక్షసావళి నెల్ల నాశ మొనర్చిన నైపుణంబు, తే. నిట్టి కార్ముక దీక్షాధురీణుఁ డయిన, భూమిజాధిప మిమ్ము నుబుద్ధియందుఁ, దలఁచి కైవల్యమందిరి తత్త్వవిదులు... ౪౯

నాముద్దులయ్యను నాదేవదేవుని నాపిన్నయన్నను నామురారి, నారత్నమగు పట్టి నాబంగరయ్యను నానిధానము రాము నాదువిష్ణు, నాకూర్మి శౌరిని నా బ్రహ్మతంండ్రిని నాదీననాథుని నాదువిభుని, నామనోనాథుని నానోముఫలమైన నాజానకీధవు నామహాత్ము, తే. వేదకీర్తించి హర్షించి

వేఁడుకొనిన, నఖిలసంపద లిప్పుడు నమరి
నట్లు, తప్పుత్రోవలఁబోయిన ధన్యుఁడౌనే.
చెడిపోక నామాట చిత్తమం దుంచుఁడీ
దేవాధిపుని మహాదేవుజపము, నియమంబు
తోనైన నిష్ఠతో నైనను భయముతో నైన
ను భక్తినైన, శక్తితోనైనను యుక్తితోనైన
ను శాంతంబుతోనైన సరసనైన, రాకపోక
లనైన రమ్యంబుగానైన నాటపాటలనైన న
లసినైన, తే. పొక్కిరైనను బిక్కిలి పోలి
యైన, సురతినైనను భక్తునిఁ జూచియైనఁ,
జేసి కైవల్య మందుఁడీ సిద్ధముగను... ౫౧
శ్రీజానకీనాథ శ్రీరామ గోవింద వాసు
దేవ ముకుంద వారిజాక్ష, శ్రీరంగనాయక
శ్రీవేంకటేశ్వర ప్రద్యుమ్న యనిరుద్ధ పం
కజాక్ష, శ్రీరుక్మిణీశ్వర శ్రీహృషీకేశ్వర

నారాయణాచ్యుత నారసింహ, శ్రీరమా
వల్లభ శ్రీజగన్నాయక శ్రీధర భూధర
శ్రీనివాస, తే. రామ జయరామ రఘురా
మ రామరామ, యనుచుఁ దలఁచినామము
లాత్మయందుఁ, గష్టములు దీర్చి రక్షించు
గారవించు… ౫౨

కడవాఁడనా నీవు కన్నులఁజూడవు నీబం
టుబంటును నీరజాక్ష, చెడ్డవాఁడని నన్ను
సరకుసేయవదేమొ పతితపావనకీర్తి పద్మ
నాభ, వీఁ డెవ్వఁడని నన్ను విడనాడిపా
యకు కరుణాసముద్ర యోకమలనయన,
వేరుచేసియు నన్ను వెలితిగాఁ జూడకు గో
పాల భూపాల గోపవేష, తే. ఆదిదేవ పరం
ధామ యవ్యయాత్మ, శ్రీరమానాథ శ్రిత
పోష శ్రీనివాస, కాచి రక్షించు మిఁక నన్ను

గామజనక... ౫౩

చిన్న ముద్దులయన్న చిన్నారిపొన్నారి
సురభూజమా రార సుందరాంగ, నన్నుఁగ
న్నయ్య నీ కన్యుఁడగాను వే నవ్వులు సేయ
కు నాగశయన, దిక్కుమాలిన నన్ను దే
వర ప్రోవుమీ చక్కని నాపాలి చక్రపాణి,
యక్కరతో నన్ను నాదరింపుము వేగ ని
క్కంబు నీవాఁడ నీలవర్ణ. తే. యనుచు వేఁ
డితి రక్షింపు మరసి నన్ను, నెంత లే దని
నీమది నెంచవలదు, కరుణఁజూడుము నా
మీఁదఁ గామజనక... ౫౪

ఎంతని వేఁడుదు నెంతనిదూఱుదు నెంతని
భాషింతు నేను సేతు, నెంతని చింతింతు నెంత
ని భావింతు నెంతని సేవింతుఁ బంతములర, నెం
తెంతనఁగ వశ మిందిరారమణ నీ సచ్చిదా

నందసౌందర్యమహిమ, చెప్పను జూడను
జెవుల వినంగను శక్య మెవ్వరికి? నా స్వా
మినీదు. తే. వేషభాషలు వర్ణింప వేయినో
ళ్ల, శేషునకునైన వశమౌనె శ్రీనివాస,
గాన మనుజుండ వర్ణింప నెఱుఁగనయ్య.
మాయలవాఁడ వే మాయలన్నియుఁ జూ
డ జలధులన్నియు మాయ జనులు మాయ,
సూర్యుండు నీమాయ చుక్కలు నీమాయ
యింద్రుండు మాయ చంద్రుండు మాయ,
మెఱయు నగ్నియుమాయ మేఘంబులును
మాయ యురుములు నీమాయ మెఱుపుమా
య, వర్షధారలుమాయ వానకాలముమాయ
చలికాలమును మాయ చలియు మాయ,
తే. యిట్టిమాయలు గట్టిగా నుర్వినిలిపి, జ
నులకెల్లను గర్వము ల్గలుగఁజేసి, జగతిన

డుపుడు వీరీతి శాశ్వతముగ... ౫౬

నీచమీనములోన నీచవృత్తినిఁ జొచ్చి
సోమకుఁజంపిన సుభగ రామ, తల లేనివాఁ
డవై తగఁ గొండమోసిన పతితపావననామ
పద్మనాభ, మిట్టరోమంబులు మేదిని మూతి
త్రో ద్రొబ్బుచు విహరించు దుష్టహరణ, సగ
ము సింగంబవై జగదపకారుని యుదరంబు
భేదించు సురగశయన, తిరిపెంపువాఁడవై
ముఱియుచు గొడ్డంటఁ దిరుగుచుహాలివై తి
విరి గొల్ల, తే. తనువుఁగైకొని వ్రతములు
దొలఁగఁ జేసి, గుఱ్ఱమెక్కిన శతకోటి కోటి
మదన, మోహనాంగ దయానిధి ముద్దు
లయ్య... ౫౭

కేశవదేవుని కీర్తనానలముచేఁ గలుషాట
వులనెల్లఁ గాల్పవచ్చు, హరినామసంస్మృతి త

రణిచే సంసారవార్ధి దాటఁగవచ్చు వసుధ లోన, శ్రీరామదేవుని చింతనఁ జేసినఁ బాప సంఘములభంజింపవచ్చుఁ, బద్మనాభస్తోత్ర భవ్యగోడ్డలిచేత దురితాటవులనెల్లఁ ద్రుంచ వచ్చుఁ, తే. గానఁ గుమతులు మిమ్ము గాన లేక, వెఱ్ఱి త్రోవలఁబోదురు వెఱపులేక, తి విరి సేవించువారికి దివ్యపదవి... ౫౭

మహిలోనఁ బొట్టకై మానవహీనుని వెంట నే తిరుగుచు వెఱ్ఱి పట్టి, నటువలె రాక్షసి యంటెనకై వడి గ్రహముపట్టినరీతిఁ గష్టమ తని, నడుగఁబోయినవార లదలించి పొమ్మ న్న గద్దించి తలవంచి కండ్లనీళ్లు, గ్రక్కు చు మదిలోన సొక్కుచు నటుమీఁద నినుఁ జేరు కొందురు నిజముగాను, తే. దీనజనమం దిరాంగణదేవభూజ, వెనక కడ తేరఁజూ

తురు వేడ్కతోడ, నట్టి నిన్నును సేవింతు
నహరహంబు... ౫౯

ఎందులకేఁగిన నేపనిచేసినఁ జలముచేనై
నను శాంతినైన, బంగారుపనినైన శృంగార
ములనైన సుద్దులనైనను ముద్దునైన, యా
త్రలనైనను రాత్రులనైనను నుపవాసముల
నైన నుబ్బియైన, జపములనైనను దపముల
నైనను గలుఁగదు నీదివ్య ఘనపదంబు, తే.
భక్తిచే నిన్నుఁ బలుఁచినభాగ్యవంతు,లిందు
నందును వేడ్కతో నెసఁగుచుండి, ప్రబ
లుదురుగాన ననుఁ గావు పంకజాక్ష... ౬౦

రావణుఁ జంపిన రామభూపాలుని సేవిం
చుఁడీ మీరు సిద్ధులార, సేతుబంధను రాముఁ
జేరి మెచ్చుఁడీ మీరు తలఁపరు దేటికో ధన్యు
లార, ఘనజటాయువు కిచ్చె గాంభీర్యపద

మని విని యెఱుంగ రదేమివిమతులార, యొ
క్క బాణంబుననొగి వాలిఁబడవేసి సుగ్రీవుఁ
బ్రోచెను సుజనులార, తే. యట్టిత్రైలోక్య
ధాముని నాదరమునఁ, దలఁచ రదియేమి
పాపమో ధన్యులార, భూమిజానాథుఁ డో
సఁగును బుణ్యపదము... ౬౧

పద్మనాభునిమీఁది పాటలుపాడుఁడీ భవ
బంధములు మాసి భద్రమగును, గమలా
మనోనాథుఁ గన్నులఁజూడుఁడీ నేత్రఫలం
బయి నెగడియుండు, శ్రీగదాధరు సేవఁ
జేయుఁ డెల్లప్పుడు రోగముల్ దొలఁగి యా
రోగ్యమగును, గోదండరాముని గొరి భజిం
చుఁడీ శత్రునాశనమగు సమ్మతముగ, తే.
నిట్టి లీలావతారుని నీశు హరిని, బలునిత
మ్ముని గోపాలబాలవిభుని, పరగ నుతియిం

చి సంపూర్ణ పదవిఁ గొనుఁడి... ౬౨

పారెడిపారెడి బావమఱందికి బండివి
లినయట్టి పరమచరితు, గొల్లముద్దుల చి
న్నగుబ్బెతలనుఁ గూడి విహరించు గోపికా
వినుతకృష్ణు,నడవియెంగిలి మేఁత యావంతఁ
బోకుండ యెత్తిమ్రింగినయట్టి యేపుకానిఁ,
దన పాటివారలఁ దగుబాలురనుఁ గూడి పా
మును మర్దించు భవ్యచరితు, తే. దేవు నా
శ్రితధేనువు దేవదేవు, జగములన్నియుఁ
బుట్టించు సంహరించు, పోసఁగ రక్షించువా
ని నాబుద్ధిఁ దలఁతు... ౬౩

కౌసల్యసుతు రాముఁ గరుణాసముద్రు ని
గంగాదినదిపాదకమలయుగళు, ఖండేం
దుధరచాప ఖండను జగదేకమండను బ్ర
హ్మాదిమౌనివంద్యుఁ, తాటకాంతకు రాము

దైత్యసంహారుని మునియాగరక్షుని మోహ
నాంగుఁ, బరశురాముని గర్వభంజను లోకై
కరంజను రఘురాము రమ్యమౌళి, తే. నెం
దు సేవింతుఁ గీర్తింతు నేప్పతోడ, బుద్ధిగల్గి
న నీదగు పుణ్యపదము, గని ప్రమోదింప
వలయును గష్టపడక... ౬౪

ఏల సేవించరో యేల భావించరో శ్రీరా
మనామంబు చిత్తమందు, మాటలాడుచునై
న మఱచియునైనను నేలుకనైన దినంబు
నేలుఁగలేప, దివమునందైనను దివిరి రా
త్రులనైన సంధ్యవేళలనైన సందనైన, భ్ర
మముచేనైనను భయమునొందైనను నోపక
యైనను నోపియైన, తే. సకలలోకాధినా
థుని సర్వసాక్షి, నాదిదేవుని జిన్మయానంద
మూర్తి, బుద్ధిఁదలఁచిన దురితము లోవు

టరుదే... ౬౫

తెలిసి తెలియఁగలేరు తెల్విచేనెల్లరో మా యలఁబడి లోకమునతలోఁడ, రామభూపా లుని రమ్యాక్షరంబులు నేవేళనైనను నెప్పు డైనఁ,బనిసేయువేళైనఁ బనిలేకయున్నను జనువేళనైనను జదువునైన, భయమునొం దైనను భ్రమతోడనైనను గలయికయం దుఁ గలిమినైనఁ, తే.బరమకల్యాణపరిపూర్ణ భద్రమూర్తి, వెన్నదొంగను గోపాలవిభు ని ఘనుని, బుద్ధిఁదలఁచిన ఘనులకుఁ బుణ్య పదవి... ౬౬

పరకాంతలను గూడి భంగంబునొందక పరధనంబులఁ గోరి పట్టుపడక, పరులను వేఁ డక పరిహాస మెంచక పరుల నిందించక భయములేక, పరులయిండ్లను జేరి పాప

ము ల్సేయక పరదారలనుబట్టి భ్రమలప
డక, సిరుల కాశింపక పరులవెంటను బోక
పరసేవ సేయక పట్టుగాను, తే. మన్మథు
నిఁ గన్న వానిని మాయకాని, శంఖచ క్రాబ్జ
ములవాని శౌరి నెపుడు, వర్ణనముఁ జేసి ప
ల్కుఁడీ వందనముల... ౬౭

మీనమై జలధిలో మేనును దడియక వే
దముల్ దెచ్చిన వేల్పువాని, దాఁబేటిరూ
పునఁ దగమందరాద్రిని వీఁపుననిల్పినవిభవ
శాలిఁ,బందిరూపంబునఁబరిపంథిఁ బరిమార్చి
కోరమీఁదను నిల్పు గోత్రధరుని, మెకము
లసామియై వేటిదైత్యునిపొట్ట చించి చెం
డాడిన సింహమూర్తిఁ, తే. బొట్టితనమున
బలిదైత్యు భూమిఁ ద్రొక్కు, వామనుని రామ
బలరామ బౌద్ధ కలికి, రీతులను నుతిసే

యు దీరీతిగాను… ౬౭

పక్షిణీనాథుని రూపవర్ణనఁ జేసి సత్యభామ
ను గూడు శౌరి గనుఁడీ, జాంబవతీవనసంచా
రి వేఁడుఁడీసాన్నిధ్యవంతేజుని సుభగమూర్తి,
మిత్రవిందాధిపు మేటిఁగీర్తించుఁడీ భద్రప
త్రానాథుఁ బాడు డెందము, శ్రీసుధాత్రీరమని
చెలువుగ్గడించుఁడీ లక్ష్మణాగ్రజజగత్ప్రభు
ణాఢ్యు, తే. నష్ట శృంగారవంతుని నష్టఘ
నుని, నష్టపీనిని దలఁచిన నెవ్వఁడైనఁ, జె
లగి కైవల్యపదవిని బొందవచ్చు… ౬౮

అంధునిచేతికి నద్దంబునిచ్చినఁ జూచునా
తను మోముసుందరంబు, కుంటివానికి నో
కల్గిగుఱ్ఱంబు నిచ్చిన నెక్కునా తనశక్తి నె
న్నఁడైన, షండునకుయువతి సమకూర్పఁగ
ల్గినఁ గామంబుతీర్చునా కాంక్షదీర, అల్పుల

కొకవేళ నర్థంబు గలిగినఁ దెలివితో నిచ్చు
నా తెగువతోడఁ, తే. దనను దెలిసికొనగ
తగుశక్తి లేక, ధరణి సంపదలన్నియుఁ దన
వట్ట్న, లేదు లాభంబు తన కొకలేశమైన.

శ్రీరామ జయరామ సింధుబంధనరామ
కారుణ్యసింధుగంభీరరామ, వారిజోదరరా
మ వైకుంఠపతిరామ దీననాయక దేవ దేవ
దేవ, కౌసల్యసుతరామ కాకుత్థ్సకులరామ
కంసమర్దన శుభాకారరామ, మావధూవర
రామ మానవేశ్వరరామ యాదిత్యకులజ స
ర్వాత్మ రామ, తే. కర్మభంజన లోకలోకా
భిరామ, నిర్మలాత్మక సదయోధ్యనిలయ
రామ, నీవె గతి మాకు రక్షించు నిగమవినుత.

యెన్ని జన్మంబులు నెత్తితినో కాని మాధవు
దలఁపక మందమతిని, అతివిహీనుఁడనైతి నవ

నిమీఁదను నిష్ఠ కాకుత్థ్సుఁ గానక గర్వమతి
ని, గాయంబులన్నియు మాయంబు లాయెఁ
బో గోపాలు నుతిలేక గూలు క్షితిని, నెం
దఱు తలిదండ్రు లేమైరి యిప్పుడు రాఘవుఁ
దలఁచక రట్టుపడిరి, తే. యింక నైనను రఘు
రాము నెప్డు మదిని, బుద్ధిలో నన్యమార్గంబు
పొడమనీక, యనుదినంబును శ్రీరాము నా
త్రఁదలఁతు... ౭౧

ఓర్పు గాంచఁగ నెంచి యొరసి చూచెద వే
మొ పట్టఁదగిన కొమ్మ పట్టినాను, వదలంగవ
లె నని వాదంబులాడిన మేల్కొని గట్టిగా
మెదలువాఁడ, నాలాగుగావని యాయాసపె
ట్టిన ముకుళితహస్తుఁడై మ్రొక్కువాఁడ, వడి
నన్నుఁ గైకోక మోస పుచ్చెదనం టె పాదా
రవిందము ల్పట్టువాఁడఁ, దల్లివడుసును నీవే

నాతం డ్రీవైన, దాత మొక్కాతి నిన్ను నా
దైవ మనుచు, 'పాహి మా' మని పలుమాఱు
పలుకువాఁడ... ౭౨

వాసుదేవునిపూజ వదలక చేసిన వైభవం
బులు గల్గు వసుధలోన, గోవిందు నెప్పుడు
గొల్చి సేవించిన సంపద లెప్పుడు చాలగ
ల్గు, నారాయణస్మృతి నమ్మకముండిన భుక్తి
ముక్తియు రెండు పొసఁగ నిచ్చు, విష్ణుసం
కీర్తన విడువక చేసిన దారిద్ర్యదుఃఖముల్
దలఁగియుండు, తే. నరుల కెల్లను హరిసేవ
నయము నమ్మి, యఖిలసంపదలును గల్గు
నాశ్రితులకు, సకలదురితము లెల్లను నశిసి
పోవు... ౭౩

పంకజాననవంద్య బ్రహ్మాండనాయక పం
కజలోచన పరమపురుష, శంకరవందిత సం

కరుణావతార పంకజాక్ష విలోలపద్మనయన, లక్ష్మీశ యోగీశ లక్ష్మణాగ్రజరామ ధాత్రీశ యోగీశ ధర్మహృదయ, సకలలోకాతీత సర్వగుణాతీత సుప్రభాసూర్యకోటిప్రకాశ. తే. సకలజీవదయాపర సార్వభౌమ, క్షీరసాగరశయన రక్షింపవయ్య, నిన్ను నే నమ్మియున్నాను నీరజాక్ష... ౭౪

నీలమేఘశ్యామ నిగమగోచరరామ ఫాలలోచననుత పరమపురుష, దశరథనందన తాటకిమర్దన యిందీవరేక్షణ యినకులేశ, యాయోధ్యపురవాస యాశ్రితజనరక్ష కల్యాణగుణహార కంసహరణ, విధిశివరక్షక విష్ణుస్వరూపక బుధజనపాలక పుణ్యపురుష, తే. జానకీనాథ మీకును జయము జయము, సకలబ్రహ్మాండనాయక శరణు శరణు, కా

చిరక్షించు నన్నును గామజనక··· ౭౫

రామనామామృతరసము ద్రావేకదాము
న్నజామీళుఁడు ముక్తుఁడగుట, రామనామా
మృతరసము ద్రావేకదా మునిపత్ని శాపవి
ముక్త యగుట, రామనామామృతరసము
ద్రావేకదా యపవర్గమందె ఖట్వాంగుఁ డి
లను, రామనామామృతరసము ద్రావే కదా
మోక్షసామ్రాజ్యంబుఁ బొందె శబరి,
తే. రామనామామృతంబును రక్తిఁగ్రోల,
ముక్తిమార్గంబు గలుగును మూఢులకును,
రామనామామృతంబునరసికుఁడగును··· ౭౬

పంకజాక్షునిపూజ పలుమారు చేయక పరు
ల నిందించుట పాటియగునె, విష్ణుసంకీర్తన
ల్వీనుల వినకను బరుల మెచ్చుట నీకుబ్రాంతి
యగునె, శేషశయనుజాలఁ జెలఁగి కీర్తించక

పరులఁగీర్తించుట భవ్యమగునె, నారాయణ
స్మృతి నమ్మికయుంచక పరదేవతలఁగొల్వఁ
బాటియగునె, తే. శ్రీరమానాథు నెప్పుడు
జిహ్వయందుఁ, బుణ్యాపపులాచు నిల్పుచుఁ
బొందుమీఱఁ, దలఁచువానికి మోక్షంబు త
థ్యమరయ... ౭౭

సాకేతపురిరామ శరణుఁజొచ్చితి నీవు ర
క్షింపవే నన్ను రామచంద్ర, దయతోడఁ
బ్రోవవే దశరథాత్మజ నన్ను గరుణతోఁబ్రో
వవే కమలనయన, కౌసల్యసుత నన్నుఁగాచి
రక్షింపవే మన్నించవే నన్ను మనుజనక,
జానకీపతిచాల సత్కృపతో నాకు నిజయం
బు లియ్యవే వేదవేద్య, తే. పరమపద రామ
గోవింద పద్మనాభ, భక్తవత్సల లోకేశ ప
రమపురుష, ధర్మచరితారిషట్కవిదారశూర.

నేత్రముల్ గల్గియు నెమ్మితో మీచూపు
సుస్థిరత్వంబునఁ జూడనైతి, జిహ్వ గల్గియు
నోట శ్రీహరినామము తాల్మితోడుత నెప్డు
తలపనైతి, శిరమదిగల్గియు క్షితిమీఁద సా
ష్టాంగముగఁ జక్కఁగా సాఁగి మ్రొక్కనైతి,
కరముల్ గల్గియు ఘనమైన మీకథల్ శ్రవ
రించి నేనెప్డు వినఁగనైతి, తే. హస్తములు గ
ల్గి మిమ్ముఁ బూజల నానందింపఁగను, శాంత మొన
రంగఁ బూజలు సలుపనైతిఁ, జిత్తశుద్ధిని మీ
సేవ సేయనైతి... ౭౯

నాస మున్నందుకు నయముగా నీపాద
తులసివాసనఁ జూచి చెలఁగనైతి, సంసారమ
ను మహాసాగరంబున మున్గి శ్రీరామభజన
నేఁ జేయనైతి, బాల్యంబునను జోరబాధక
త్వముఁ జెంది నీపయిభక్తినే నిలుపనైతి,

యౌవనంబునఁ గామ్యమానసమును నొంది
కూహరంబున బుద్ధి కుదుపనైతి, తే. నెంత
పాపినై గాకున్న నెన్నఁడైన, దేవుఁడని నీవె
దిక్కని దెలియఁదగనె, గాన దుష్కృతమెం
చక కాపు నన్ను... ౫౦

శ్రీరామ వినుము నే క్షితిని జన్మించిన వి
ధము నెవ్వరితోను విన్నవింతుఁ, దల్లిదండ్రు
లనాప్త తనయులు బంధుల సతులసోదర దే
హసదన సఖుల, సక్కలఁ జెల్లెండ్ర నాప్తు
హితులను నితరబంధువులను నిష్టసఖులఁ, బ
రుల నాహారని పాటించి యెప్పుడు జనము
లోకమునెల్లసత్యమనుచు, తే. భార్యరతి కేళి
సంబంధభరిత మమర, దీనికన్నను గల్గునె
దివ్యమైన, బంధ మన్యంబు ద్రుంచ నీపద
మె చాలు... ౫౧

ఇలను బుట్టినవార లెంతేసిబుధు లైరి వీ
రితోనెటువలె విన్నవింతుఁ, దల్లి తండ్రియు
దాత పుత్త్రుఁడు భ్రాతవు ప్రభుఁడవు గురుఁడ
వు బాంధవుఁడవు, నీవుపక్కఁగ నింక నెవ్వ
రితోనేని పల్కుటదెట్టుల పరమపురుష, ఆ
ర్తరక్షక నిన్నెయాశ్రయించితిదేవ కాచి
రక్షించుమీ కమలారమణ, తే. నీదులాభం
బుగోరిన నిక్కముగను, గోర్కెలెల్లను నా
కుఁ జేకూరుచుండు, దీనరక్షక భువి నాకు
దిక్కు నీవె... ౫౨

తోఁచి తోఁచక నేను దొడరిమీచింతన చే
యక సంసారజలధి మున్గి, యడఁగని తృష్ణ
ల నాహారవాంఛల పడపడి మోహసంభ్రాం
తి జెంది, తెలిసియుఁ దెలియక దేహవాసనఁ
జెంది తలఁగోరి మిమ్ములఁ దలఁచనైతి, మఱి

చి మఱవక నిత్యమార్గంబులను మిమ్ము దల్చ
క యింద్రియతతులఁ దగిలి, తే. నట్టిపాపా
త్ముఁడను నన్ను నెలమి నెప్డు, కాచి రక్షిం
చుమన్నించు ఘనతమీఱఁ, గృపఁ బాత్రు
నిగాఁ జూడు కువలయేశ... ౭౩

జననిగర్భమునందు జన్మించినది మొదల్
బాల్యంబునను గొంత ప్రబలుచుండి, యట
మీఁదఁ గౌమారప్రాయంబునఁ గొన్నాళ్లు త
ల్లిదండ్రులప్రేమ పనరియుండి, యౌవన ప్రా
యంబునందు సతీక్రీడ నింద్రియంబుల ప్రే
మ నెప్డు దగిలి, ముసలితనంబున మునుఁగుచుఁ
గొన్నాళ్లు కార్పణ్యముల చేతఁ గష్టపడుచు,
తే. నింతకాలంబునకు నిన్ను నెఱుఁగ లేక,
వృద్ధిఁ బొందితిఁ బ్రకృతిచే విశదముగను, గ
రుణఁ జూడుము నన్ను దుష్కృత్యుఁ డనక...

శ్రీరామ నామీఁదఁ జిత్తంబు రాదాయె నాతల్లిపండ్రని నమ్ముకొంటి, దశరథాత్మజ నీకు దయయింతలేదాయె నాయిలువేల్పని నమ్ముకొంటి, సత్యసంధుఁడ నీదు చనువింత లేదాయె నాప్రాణవిభుఁడని నమ్ముకొంటి, భక్తవత్సల నీకు భావంబు లేదాయె నామూలధనమని నమ్ముకొంటి, తే. పొరవు గావునఁ బ్రోవుము దురితహరణ, నిందలేకుండఁ జేపట్టి నిర్వహించు, పరుల నిందించ నాకేల పరమపురుష... ౧౫

మూర్ఖుఁడు మూర్ఖుఁడు ముచ్చటాడఁగ వింత దీనులపలుకులు చెక్కువింత, కోఁతికోనంగు లు గూడియుండఁగ వింత కుక్క నక్కలు గూడి కూయు వింత, కోపితోఁ గుటిలుండు కూర్మి చేయుట వింత కపటఘాతకు లెప్డు క

లయ వింత, మంత్రులతో మంత్రి మాచ్చరిం
చుట వింత కీడు మేలెఱుఁగని కీర్తి వింత, తే.
యెంతవారికి లబ్ధంబు లంతెగాక, ననుభవిం
పఁగ నేస్తరె యర్థములెల్లఁ, గలుగు జ్ఞాను
లసంగతి ఘనత యశము... ౧౬

శ్రీరామ నీవు నాచిత్తమందే నిల్చి ర
క్షింపవయ్యా నన్నక్షయముగ, నన్ను ర
క్షింపను నాథు లెవ్వరు లేరు నాస్వామి నీ
వని నమ్మినాను, దల్లివైనను నీవె తండ్రివై
నను నీవె వేదాంతవేద్య నిన్నే వేఁడినాను, అ
యోధ్యావాసా యనంతస్వరూపక ఈవేళ
నీవు నన్నేలుకొనుము, తే. నన్ను రక్షించు
మని నిన్ను వేఁడినాను, నమ్మఁగాఁజాల నెవ్వరి
నెమ్మితోడ, నీకుఁ బ్రియుఁడను మ్రొక్కితి
నీరజాక్ష... ౧౭

దీనదయాకర దీనరక్షణ నీవు కావవె న
న్నిష్ట కమలనయన, పరమాత్మ పరమాత్మ
పలుకు బొంకించకు పనులకు మీపాదపద్మ సే
వ, కమలేశ కమలాక్ష కరుణతో రక్షింపు
వరము లియ్యవె నాకు వరదయాళ, లక్ష్మీశ
లక్ష్మీశ లలిమీఱఁగను నాత్మదలఁచి రక్షింపవే
జలజనేత్ర, తే. పద్మలోచన పరమాత్మ పా
రిజాత, స్వామి రక్షించు మిఁక నన్ను సా
ర్వభౌమ, నిన్ను నెప్పుడు సేవింతు నీలవర్ణ...
నినుఁ గొనియాడితి నీకృపఁ గనుఁగొంటి
నిజముగా రక్షింప నీవె యుంటి, నీప్రాపుగలద
ని నీదులోకంబులఁ గొనియాడ నేవేళ గో
లయుంటి, బ్రహ్మంబు నీవని పలుమారు
నిన్ను నే బ్రస్తుతి సేయుదుఁ బరమపురుష,
దాసుండననియంటి దయకుఁ బాత్రుఁడ నం

ట్టి నీకు నేవశుఁడను నేప్పగంటిఁ, తే. దల్లి
తండ్రియు నీవని తలఁచియుంటి, నేను నీ
వాఁడనై యుండి నిన్నుఁ గొల్తు, కాచిరక్షిం
చు మిఁక నన్ను గరుణతోడ... ౮౯

ఆనాఁడె తెలియక యాయాసమందితి నె
న్నఁడుమీసేవయెఱుఁగనైతి.ముక్తికి మొద
లని మూలంబు తెలిసిన నీపాదకమలంబు నె
మ్మిఁ గొల్తు, నింతనులభుఁడని యిన్నాళ్లునెఱుఁ
గననానాఁడె మిమ్ము నేనాశ్రయింతుఁ, గర్మం
బు లెడఁబాపి కరుణతో డుత నన్ను నరసి
రక్షించుమీ యాదిపురుష, తే. తలఁపులోఁ
జాల నమ్మితిఁ దండ్రివనుచుఁ, బుత్ర వాత్స
ల్యమును నుంచి పొందుమీఱ, నిలిపి రక్షిం
చు మిఁక నన్ను నీరజాక్ష... ౯౦

హారామ హాకృష్ణ హాయచ్యుతా యని

కోరి కొల్చెద మిమ్ముఁ గోరికలలర, నీవే
ళ నావేళ నేవేళనైనను బ్రాపు దాపనియే
ను బ్రస్తుతింతు, నారాయణస్మృతి నామది
నెప్పుడు కట్టివేసియు నుండు కరుణతోడ,
వామన శ్రీధర వసుధపాలక నన్నుఁ గాచి
రక్షించుమీ ఘనతమీఱ, తే. నాకు నిష్టుఁడవ
ని చాలఁ నమ్ముకొంటి, నీవు కాపాడకున్న
నింకెవరు దిక్కు, నీకు భక్తుఁడ నెుక్కొక
నీరజాక్ష... ౬౧

రామకీర్తన లెప్పు లాలించి వినువాఁడు వై
కుంఠపురమున వసలకుండుఁ, గృష్ణనామం
బెప్డు కీర్తించివినువాఁడు మధ్యమపురమందు
మఱిగియుండు, మధుసూదనాయని మనవ
క పలఁచిన మర్మకర్మంబులు మాయమౌను,
గోవిందనామంబు కోరినాదముఁ జేయ వే

షపాపంబులు తొలఁగిపోవు, తే. నచ్యుతా
నంతగోవింద హరిముకుంద, పదవి నాకిమ్ము
నిన్ను నేఁ బాయకుందుఁ, బద్మలోచన నా
తండ్రి పరమపురుష... ౬౨

నీభక్తులగువారి నిఖిలలోకంబుల నిజము
గాఁబ్రోతువు నీలవర్ణ, నీకీర్తి పొందుగా నీకు
సేవలుచేయు పరమపుణ్యాలకెల్ల భవ్యపద
ము, భువిలోనఁ గీర్తిని గొనియాడి కీర్తించు
మనుజుల కొదవు నీమందిరంబు, భక్తుఁడై
యీరీతి భజనచేయఁగ నీవు నుప్పొంగి యి
చ్చెద వొప్పుతోడ, తే. నిట్టిసేవలు గొని నీ
వు నిహపరములు, నాదరంబున నాకిమ్ము
మోదమూని, గట్టిగా నీవు నన్నుఁ జేపట్ట
వయ్య... ౬౩

యోగమార్గంబున నెగసెద నంటినా
యోగంబువగలు నాయొద్దలేవు, గగనమా
ర్గంబునఁ గదలెదనంటినా కవచభూషణమే
ది కమలనయన, ఆత్మమార్గంబున నెగసెద
నంటినా యాత్మ నమ్మినబంధు నరయలేదు,
అభ్ర మార్గంబున నరగెదనంటినా యశ్వ
వాహనములునావిగావు, తే. నీదుదయ య
ది నాయందు నిలిచియున్న, నఖిలలోకం
బులగును నా కల్ప మిపుడు, కుతుకమున న
న్నుఁ బ్రోవుము కువలయేశ ... ౬౪

చిర కాలమున నేను స్థిరమనియుంటినా జ
న్మకర్మంబులు చెప్పనేల, శ్రీకృష్ణనామంబు
స్థిర మని యుంటినా భయనివారణమౌను
బరమపురుష, మదహరమిమ్ము నాహృదయం
బులోనిల్పఁ గరుణతోఁగాతువు కమలనయ

న, మురహర నీకు నే ముకుళితహస్తుఁ డై
మ్రొక్కి-సేవింపంగ మోక్షపదవి, తే. నన్ను
తించెవ నిన్నుఁ గౌసల్యాతనయ, చిత్తగింపు
ము నాయన్న శ్రీనివాస, శరణుఁజొచ్చితి
నీకును శరణు శరణు··· ౬౫

కైవల్యపదమును ఘనమని యంటినా
కైవల్యమది మిముఁ గన్నచోటు, బ్రహ్మలో
కం బాదిపద మని యంటినా బ్రహ్మాదులు
ను నిన్నే ప్రస్తుతింతు, రింద్రలోకమె నా
కునిష్టంబటంటినా యష్టదిక్పతులు మిమ్మా
శ్రయింత్రు, పదవి పదవిగాదు పరమాత్మ
నీపాద కమలపదవి యదె కంసహరణ,
తే. యిట్టిపదవులు నాకేల యినకులేశ, కష్ట
పెట్టకయే వేళ కరుణఁజూడు, నిష్ఠతో నన్నుఁ
గావుము నీలవర్ణ··· ౬౬

కమలనాభుఁడ నిన్ను కన్నులఁ జూచిన
సంభవించు ఫలమ్ము స్వామినాథ, జలజలో
చన నిన్ను శరణని వేఁడిన చేపట్టి రక్షించు
శేషశయన, పరమాత్మ పరమేశ పద్మలో
చన నిన్నుఁ గొనియాడ నేఁజాల గోరినా
ను, నారాయణ ముకుంద నరహరి నిన్ను నే
నెప్పుడు సేవింతు నీలవర్ణ, తే. యిటకు
రావయ్య నాతండ్రి యినకులేశ, తడవు
చేయక నన్నేలు ధర్మనిపుణ, నిలువకయె
వేగ రావయ్య నీరజాక్ష... ౬౭

ధర్మంబు దలఁచినఁ దనకునుజయమిచ్చుఁ
గర్మంబు దలఁచిన గాదు జయము, శాంతం
బు నుంచిన శాశ్వతపద మొందు శత్రుత్వ
మున గొప్ప చేటునొందుఁ, గుటిలత్వమునను

దుష్కృతమొందు మనుజుఁడు కుటిలత్వ
మే చేటు కువలయేశ, బద్ధులైనటువంటి
బంధులఁగూడిన తనవెంట నొకరైనఁ దర్లిరా
రు, తే. యిట్టివారలు నాకేల యినకులేశ,
నీదుకృప నాకు గట్టిగాఁ గలుగఁ జేసి, పర
మపదమిచ్చి నన్నుఁ జేపట్టవయ్య.... ౯౨

ఆవేళ యమునిచే నాయాసపడలేక నీ
వేళనే మిమ్ము నెలవుతోడ, నాతల్లిదం డ్రి
ని నమ్మి నీపాదము ల్పట్టిసేవించెదఁ బద్మనా
భ, శ్రీరామ శ్రీరామ శ్రీరామ యని మి
మ్ము స్మరణచేసెదనయ్య చక్రపాణి, కోదం
డ కోదండ కోదండరామని కొలిచి సేవిం
చెదఁ గోర్కెదీరఁ, తే. బద్మసంభవముఖనం
తపరమపురుష, నన్నుఁగాచియు రక్షించు

నయముతోడఁ, గరుణతోడుత ననుఁజూ
డు కమలనయన, రామతారక దశరథ
రాజతనయ. ౯౯

రామతారకశతకము సంపూర్ణము.



చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము:—1925.

# ఆంధ్ర గ్రంథములు.



| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అచ్చ తెనుఁగు రామాయణము, శుద్ధప్రతి | ... | 1 | 4 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 10 |

శ్రీమదాంధ్ర భారతము-పద్యకావ్యము:—

అనేకవ్రాతప్రతుల సహాయమున చిరకాలమునుండి సంపూర్ణపరిశ్రమముతోఁ బరిష్కరింపఁబడినది. మేలు కాగితములపై స్ఫుటముగ నచ్చొత్తించి మంచి కాలికో బైండు చేయఁబడియున్నది.

| | | | |
|---|---|---|---|
| 7 సంపుటముల ప్రతి | 1-కి రూ. | 15 | 12 |
| 3 సంపుటముల ప్రతి | ... | 15 | 0 |
| ఆది, సభాపర్వములుగల సంపుటము | ... | 2 | 4 |
| ఆరణ్యపర్వము ,, | ... | 2 | 4 |
| విరాటోద్యోగపర్వములు ,, | ... | 2 | 4 |
| భీష్మద్రోణపర్వములుగల సంపుటము | ... | 2 | 4 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు ,, | ... | 2 | 4 |
| శాంతిపర్వము ,, | ... | 2 | 4 |
| ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములుగలసంపుటము | | 2 | 4 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 6 | 8 |
| యుద్ధపంచకము ,, | ... | 4 | 4 |
| శాంతిసప్తకము ,, | ... | 4 | 4 |

| | ప్రతి 1-కి రూపా. | అ. |
|---|---|---|
| మొల్లరామాయణము, చిన్నసైజు, పెద్దక్షరములు | 0 | 10 |
| ఆధ్యాత్మరామాయణము, నూతనముద్రితము | 1 | 8 |
| శివలీలావిలాసము, కూచిమంచి తిమ్మకవికృతము | 0 | 6 |
| శ్రీనాథునివీథినాటకము ... | 0 | 2 |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది, క్రొత్తకూర్పు | 1 | 0 |
| డిటో, కాలికోబైండు ... | 1 | 6 |
| సప్తమస్కంధము, సాధారణప్రతి (భాగవతము) | 0 | 6 |
| డిటో, సటీక, చిన్నసైజు ... | 1 | 4 |
| డిటో, కాలికోబైండు ... | 1 | 8 |
| సారంగధరచరిత్రము, చేమకూర వేంకటకవికృతము | 0 | 10 |
| సానందోపాఖ్యానము, శ్రీ శివరామకవికృతము | 1 | 0 |
| సులక్షణసారము, సటీక ... | 0 | 10 |
| డిటో, కాలికోబైండు ... | 0 | 14 |
| హరవిలాసము, కాలికోబైండు ... | 1 | 2 |
| హంసవింశతి, నారాయణామాత్యప్రణీతము, కాలికోబైండు ... | 1 | 4 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవిప్రణీతము | 0 | 12 |
| డిటో, కాలికోబైండు ... | 1 | 2 |
| వాసిష్ఠరామాయణము, ద్విపద, తరిగొండ వెంకమాంబ | 1 | 4 |
| రంగనాథరామాయణము, ద్విపద, క్రొత్తకూర్పు | 3 | 8 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక, అనేకనూతనాంశములుచేర్చి చిన్నసైజున ముద్రించినారము. టీక, వివరణము మిక్కిలి విపులము, ఈవఱకుప్రకటితమైన ప్రతులకన్న బాగుగనున్నది. సాధారణప్రతి | 2 | 8 |
| డిటో, మేలుప్రతి, కాలికోబైండు ... | 3 | 8 |